REG. No. M. 2135 REG. No N 4

The First Telugu Bi-weekly in Andra Desa, The only Telugu News Paper for H. E. H The Nizam's Dominions

# గోలకొండ పత్రిక

ప్రతి బుధవారము శనివారము ప్రకటింపఁబడును

హైదరాబాదు—దక్కన్

1-3159

GOLAKONDA PATRIKA HYDERABAD Dn

సంపుటము ౫ } ప్రమోదూతనామ సంవత్సర మార్గశీర్ష బ౹౩ శనివారము 13—12—30 { సంచిక ౫౭

# సంగీతమునకు చింతకాయలు రాలునా?

భారత ప్రభుత్వము ప్రజలకు పూర్తిగా అధీనము కానిచో కొందర మైనను మరల భారతదేశమునకు ప్రయాణము చెయ్యవలెనని జయకరుగారు తెలుపుట

లండను నగరము నందలి లిబియాంక్లబులో జరిగిన బహిరంగ సభయందు ఎం ఆర్ జయకరు గారు రౌండుటేబిలు సభా చర్యల గూర్చి యుపన్యసించుచు ఇట్లు తెల్పిరి ——

"రౌండుటేబిలు సభకు వచ్చిన భారతజాతీయ వాదుల ప్రతినిధులలో అధికమగు సంఖ్యాతృప్తి కలిగి యున్నది. ఈ వారములోగూడ పరిస్థితులు క్రింద వారములలో నున్నట్లే యుండినయెడల మేము వెంటనే మా దేశమునకు వెడలుటయే ముఖ్యకర్తవ్యమగును. రౌండుటేబిలు సభలో ప్రతినిధులుగా నున్న బ్రిటిషుప్రముఖులు పురుష శ్రేష్ఠులని చెప్పుటకెట్టి సంశయమును లేదు. కాని "6000 మైళ్ల దూరమున భారతదేశమనునొక దేశము కలదు. ఆదేశము వారుకూడ స్వరాజ్యమును బడయుటకు దీక్ష బూనియున్నారు. అందుకొరకు ప్రతిదినమును వందలకొలదిగా చెరసాలలకు పోవుచున్నారు" అను విషయము మాత్రము బ్రిటను దేశీయు లెరుగరు. మరచిపోవుచునే యుందురు. గాంధిమహాత్ముడు ప్రపంచము నందిపుడున్న సజ్జనులందరిలో అగ్రగణ్యుడని మేమును వేదాంతమును రాజకీయములలోనికి తేగలిగినది గాంధిమహాత్ముడొక్కడే "ఈ రౌండుటేబిలు సభ కేవలము వాక్కౌశలమును వెల్లడించుటకే యేర్పడినది దీనివలన నెట్టి ఫలితమును కలుగదు" అని మహాత్మునను పండిత మోతీలాలు నెహ్రూగారును కూడ నమ్ముచున్నారు. కావుననే యీ సభలో జరుగుచున్న చర్యలను గాంధి మహాత్ముడు మిక్కిలి శ్రద్ధగా గమనించుచున్నాడని నేను చెప్పగలను. అంతటి విమర్శనాదృష్టితో ఇతరు లెవ్వరును దీనిని గమనించుచుండరని కూడ నేను చెప్పగలను.

"మీరు రౌండుటేబిలు సభకు వెళ్లివచ్చిన పిమ్మట మాలో నొకడను రంపుడు. నేను కోరిన విషయములలోని సారాంశమును మీకు నిజముగా బడయ గలిగినచో నేను దానిని మిక్కిలి శ్రద్ధతో పరీక్షించెదను అపుడు నాపున రావలోకన మొనరించెదను" అని మేము ఎఱ్ఱవాడ చెరసాలనుండి కడపటిసారి వెడలి పోవనున్నపుడు మహాత్ముడు తెలిపెను. "భారత ప్రభుత్వము ప్రజలకు పూర్తిగా అధీనము కావలెను" అను విషయమునే మేము ముఖ్యముగా కోరుచున్నాము. ఇది త్వరలోమాకు సిద్ధింప కున్నచో ఇండియా నుండి యిచటికి వచ్చిన వారిలో కొందరమైనను మరుసటి స్టీమరులో మరల యిండియాకు బయలుదేర వలసియే యుండును"

---

# జైలులో మహాత్ముని కార్యక్రమము

ఎఱ్ఱవాడ చెరసాలయందు గాంధీ మహాత్ముని సహచరులుగా నుండినట్టియు, ఇటీవల విడుదలలైనట్టియు, కాకా కేల్కరుగారు మహాత్ముని కార్యక్రమము గూర్చి ఇట్లు తెలిపిరి ——

నాల్గు గంటలకు మేము మేల్కాంచెదము 4-20 గంటలకు ప్రాతఃకాల దైవప్రార్థన ప్రారంభమగును దైవ ప్రార్థనానంతరము గీతాపారాయణము జరుగును అనంతరము నేను విహారింపబోవుచుంటిని మహాత్ముడు అరగంటసేపు చదువుకొని, వ్రాసికొని నన్ను వచ్చి కలియుచుండెను మేమిద్దరము విహరించుచు గీతనుగూర్చియు సబర్మతీ యాశ్రమము యొక్క ఆశయములను గూర్చియు, రాట్న చక్రమును గూర్చియు, నా నియమ సాహిత్యమును గూర్చియు సాధారణముగా మాటలాడుకొను చుంటిమి. ఆరు గంటలకు మేము భోజనమునకు లేచుచుంటిమి మహాత్ముడు పెరుగు (పుచ్చుకొను రోజులలో) నీటిలో నానవేసిన ఖర్జూరములు తినుచుండెను. మా భోజనము పూర్తికాగానే మా పాలకై మేకలు వచ్చి తయారుగా నుండును అత్యాతురతతో పాలు ద్రావుచు అప్పుడప్పుడాగి అరుగు మేకపిల్లలను జూచుట మహాత్మునికెంతయు ఆనంద దాయకముగా నుండును పాలు త్రాగగానే మహాత్ముడు ఆలస్యమేమియు చేయక రాట్నము యెదుట కూర్చుండును ఒకటి రెండు సారులవసరమయి నప్పుడు మాత్రము రాట్నము నాపి మహాత్ముడు 10 30 వరకు వడుకును 7 గంటలవేళ మహాత్ముడు వేడినీటిలో నిమ్మకాయపిండి, ఉప్పువేసి త్రాగును. 10-30 కు మహాత్ముడు స్నానమునకు బోవుచుండెను. ప్రతిరోజు కొంతసేపు ఆయన దూది ఏకులని ఏకులు చేయునని చెప్ప మరచితిని అరగంట పనిచేయుట వలన రోజుకు కావలసిన ఏకులకంటె అయినను యెక్కువ ఏకు తయారగును ఒకసారి సర్దారు వల్లభాయి పటేలుగారికి ఏకులు అయిపోయినందున ఆయన సూపరింటెండెంటు ద్వారా మహాత్మునికి కబురు చేసెను నా దగ్గరకూడ ఏకులు కొద్దిగా మాత్రమే ఉండెడివి తల్లి పిల్లల నిమిత్తమై వండి పెట్టినట్లు మహాత్ముడు మముబోంట్ల యుపయోగార్థమై ఏకుల చేయుచుండును

## మధ్యాహ్నము

11 గంటలకు మేము మధ్యాహ్న భోజనమునకు లేచెడి వారము వారు మరల పెరుగులో సోడా ఉప్పు వేసి పుచ్చుకొనెడి వారు ఉడకబెట్టిన కూరగాయలును, ద్రాక్షగాని, ఖర్జూరగాని వారు పుచ్చుకొందురు. ఈ సమయముననే వార్తా పత్రికలు చేరును. లాఠీ ప్రహారణములను గూర్చియు బొంబాయి ధీర యువతీలలామలు జాతీయ పతాకమును ప్రతిష్ఠించుటను గూర్చియు, యింక యితర సమాచారములను గూర్చియు నేను చదువుచుండెడి వాడను సాయంత్రము విహరించు సమయమున మేము వాని మంచి చెడ్డలను గూర్చి చర్చించుచుంటిమి భోజనసమయమున ఆహారమునుగూర్చియు ప్రకృతి చికిత్సను గూర్చియు మేము ముఖ్యముగా ముచ్చటించు చుంటిమి ఏలనవగా మహాత్ముడీ విషయములను గూర్చి చాల చదివెను వారియనుభవము కూడ విస్తారమే. భోజనము కాగానే రాట్నము తప్పక వడక వలెను. తరువాత పత్రికాపఠనము, తరువాత కొంచెముసేపు విశ్రాంతి, ఒంటి గంటన్నరకు మహాత్ముడు నీటిలో నిమ్మకాయ పిండి, సోడా వేసి త్రాగును. తరువాత మేము దైవ చదువుకొనుట, ఉత్తరములు వ్రాయుట జరుగును మీరాబాయి కొరకై ఆశ్రమ కీర్తనలు ఆంగ్లములోనికి తర్జుమా చేయబడును 4 గంటలకు, మహాత్ముడు యీనబద్దతోను పగిలి పోయిన పెంకుతోను స్వయముగా తయారుచేసిన తక్లిపై, వడకు దారముతీయుచుండును, తక్లీకిని, మీ వేళ్లకును మెత్తని బూడిద రాయుదురు, అని వార్ధా ఆశ్రమము నుండి వినోబాగారు వ్రాసిన పరిహారము చేయగా మహాత్మునకు యెక్కువ త్వరగా వడక గలిగెను.

## సాయంత్రము

5 గంటలు కొట్టగానే సాయంత్రము భోజనము సిద్ధము మరల పెరుగు, ఖర్జూర, కూరగాయలు అన్నము తినగానే నేను పాత్రలను పరిశుభ్రము చేయుటకు పోదును. మరుసటి రోజుకు ఖర్జూరములను మహాత్ముడు నానవేయును. తరువాత మేము విహారము చేయుదుము 7 గంటలకు సాయంప్రార్థనను మేము ప్రారంభింతుము. ఆశ్రమములో వానాకాల మప్పుడు 7-30కు ప్రార్థన చేయుచుండిరి చలికాలము రాగానే ఆశ్రమ ప్రార్థన 7 గంటలకు మార్చబడెను అనేక వందల మైళ్ల దూరమున నున్న ఆశ్రమ బాలురతోడను, బాలికలతోడను ఒక్క కాలముననే ప్రార్థించ వచ్చును ఉద్దేశ్యముతో మేమును కాలము మార్చితిమి.

## రాత్రిచర్య

ప్రార్థనానంతరము గాంధి మహాత్ముడు ఉత్తరములను వ్రాసికొనును ఆశ్రమవాసులందరును ఒక్క కుటుంబికులేగాన అచ్చటి ప్రతిబాలుడును బాలికయు మహాత్ముని నద్దనుండి లేఖను పొందును ఆశ్రమములో తిరుగుచుండగా మహాత్ముడు బాలికల భుజముమీద ఆనుకొనెను, గనుక కొందరు పిల్లలు ఆగూనచేతి కర్రయని సంతకము చేయుదురు పిల్లలు వారి యుత్తరములలో నేమియు దాచరు వారి లోపములను వారు తెలుపుకొనెదరు, చిన్న చిన్న విషయముల గూర్చి వారు బాపూజికి వ్రాతురు ప్రార్థనా కాలమున తనకేల నిద్రవచ్చునో మహాత్ముడు తెలుపవలెనని ఆశ్రమమునకు వచ్చిన యొకడు పృచ్ఛ చేసెననియు రాట్నము నందతనికి యింకను శ్రద్ధకలుగ లేదని మరియొకడు అడిగెనని యొక బాలిక వ్రాయును దానికి మహాత్ముడు ప్రత్యుత్తర మిచ్చుచు (ప్రార్థన మానవునకు ఆహారము, నిద్ర, పనివలె అవసరమనియు అతడు ఆశ్రమమునకు వచ్చి పృచ్ఛచేసినవాడు) బీదలనింక ప్రేమించుట తెలిసికొనవలెననియు వ్రాయును తాను చేసిన తప్పిదములను యేకరువు బెట్టుచు యిక ముందు తప్పిదములు చేయనని యొకడు వ్రాయును, ఈ ఉత్తరములను చెరసాలాధికారులు చూచుట ఆయన కెంతమాత్రమును కిష్టముగా నుండదు అయినను భయమేల? హృదయమునుండి కల్మషములను, అపవిత్రభావములను పోద్రోల దలచిన యతనికి భయమెందుకుండును, ఒకానొకనికి ప్రియపుత్రిక పోయినది. దానివలన ఆయనకు మితిలేని దుఃఖము కలిగి మహాత్ముని కడకు యేమి శరణ్యమని. వ్రాయును మహాత్ముడు ఓదార్పులేమే గాక ఉత్సాహము కూడ గొల్పుచు ప్రత్యుత్తరము వ్రాయును. 9 గంటలు కొట్టగానే మహాత్ముడు ఉత్తరములు వ్రాయుట యాపి నిద్రపోవును. మహాత్ముడెప్పుడు ఆరుబయట నక్షత్ర కాంతిలో బరుండును సూర్యకాంతివలె నక్షత్రకాంతియు దేహమునకు ఆరోగ్యకరమని మహాత్ముడు నమ్మియున్నాడు. ఎంత చలిగా నున్నను సరే, యెంత వానకురియు చున్నను సరే, ఆయన వరాండాలో మంచము పట్టుకొనెదము, నేను మొదటనే నిద్రలేచి చూచినప్పుడు మహాత్ముడు గాఢ నిద్రలో నుండును.

